# రాజకీయ కురుక్షేత్రం

(నాటకం)

2830/R

★

రచన

బొల్లిముంత శివరామకృష్ణ

96

★

జనసాహితి, తెనాలి

# ఒక మాట

1954 నవంబరుకు చాలాముందు సంగతి.

ఆంధ్ర శాసన సభలో అవిశ్వాసతీర్మానం కోసం ప్రభుత్వపక్షం ప్రతిపక్షం రెండూ తీవ్రప్రయత్నాలు సాగిస్తున్నాయి. మరోవైపున బంజరుసత్యాగ్రహాన్ని ప్రారంభించబోయేముందు గుంటూరుజిల్లా బంజరు పోరాట కార్యాచరణ సంఘం ప్రభుత్వంవద్దకు రాయబారం వెళ్ళిందికూడా.

ఒకనాటి రాత్రి యివన్నీ మాట్లాడుతూ వుండగా యీ రాయబారమూ అవిశ్వాసతీర్మానమూ యిదంతా, కురుక్షేత్ర యుద్ధసన్నాహాలకు ముందరి దశకు పోలినట్టుంది. ఆనాడే రాజకీయ కురుక్షేత్రం వ్రాయాలని ప్రారంభించాను. కురుక్షేత్ర యుద్ధానికి యిరుపక్షాలు సిద్ధంకావటం వరకూ వ్రాయాలని ప్లాను వేసుకున్నా. తరువాత అనేక అవిరామ కార్యక్రమాల మధ్య కొన్నాళ్ళకు ప్రథమాంకం ముగించాను. అప్పటికే ప్రభుత్వందిగిపోయి ఎన్నికలు వచ్చాయి. యికఆవాతావరణం లో రచన యేమాత్రమూ సాగిందికాదు. అనేకమందిమిత్రులు నారాజకీయ గయోపాఖ్యానం చదివిన, ప్రదర్శించిన, చూచిన వారంతా అదేపనిగా కురుక్షేత్రాన్ని పూర్తిచేసి ప్రచురింపవలసిందిగా వత్తిడిపెడ్తూవచ్చారు. ఆఫలితమే యీనాటికైనా యీపుస్తకం వెలుగు చూడటం. రాజధాని సమస్యను వివరించడంలో గయోపాఖ్యానం గుర్తునకు రావలెనని (ధ్వనించవలెనని) ఆనాటి యత్నం. బంజరురాయ బారమూ అవిశ్వాస

తీర్మానమునూ ప్రదర్శించడంలో క్రిష్ణరాయబారం ధ్వనించవలెనని యీనాటి యత్నం.

అందుకే కథాసంవిధానంలోనూ పద్యాలలోనూ కూడా కీ॥ శే॥ తిరుపతి వెంకటకవీంద్రుల పాండవోద్యోగాన్ని అనుసరించాను. యింకా శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి 'విజయశ్రీ' పద్యాలను కూడా మార్పుచేసుకుంటూ వాడుకొన్నాను. ఇందుకు వారికి సర్వదా కృతజ్ఞుడను.

పోతే భాషా నియమాలను కొన్నిటిని ఉచ్చారణ సౌలభ్యంకోసం వదిలివేశాను. కొన్నిచోట్ల యతులూ ప్రాసలూ కూడా,

గతంలో-రాజకీయ గయోపాఖ్యానం మరో నెలలోనే రెండవ ముద్రణకు వచ్చేటంతగా ఆదరించి యీరచనకు నన్ను త్సాహ పరచిన తెలుగు ప్రజానీకానికి నాధన్యవాదాలు

తెనాలి
20-8-55

రచయిత



# ప్రథమాంకము

## ఇందలి పాత్రలు

శ్రీ నాగిరెడ్డి: ఆంధ్రశాసన సభా ప్రతిపక్షనాయకుడు

శ్రీ ధర్మయ్య
శ్రీ భీమయ్య
శ్రీ అర్జునరావు } ప్రజల ప్రతినిధులు

## స్థలం

తెలుగుదేశంలో ఏదేని ఒక ప్రాంతం

## సమయం

1954 ఆక్టోబరు 29 శాసనసభాసమా
వేశానికి ముందు ఒక రోజున

[తెరలేవగా మొదట శ్రీ నాగిరెడ్డియూ, పిదప ఒక రొక్కరుగా కూలిరైతులునూ ప్రవేశింతురు.]

నాగిరెడ్డి: సోదర ప్రజలారా! తెలుగుదేశపాలకులారా!

ధర్మయ్య: బాబూ నాగిరెడ్డి! 'పరిపాలకులారా'! యని మమ్ము పిలిచిన యాపిలుపు ముందుకాలమున కేమో గాని యిప్పటికి మాత్రము మేమందులకు తగముగదా?

నాగి:- 'ముందుకాలమున కేమో' యనునాశయున్నదిగదా సరే ప్రస్తుతాంశమునకు వత్తము.

ధర్మ:- అయ్యా! ఆంధ్ర శాసన సభా ప్రతిపక్షనాయకా! ప్రజాభి మానధనా! మీకుమాత్రము తెలియనిదేమున్నది.

తమ్ములవంటి పేదప్రజ దల్పరు, స్వార్థులగూడి మాదుసే
ద్యమ్ములె మాకు దక్కనియరైరి పోలీసులబంపి,పత్రికా
సమ్ముఖమందె మంత్రులిదిచాటుచు నుండ్రిగదయ్య!మత్తచి
త్తమ్మున కన్నుగానని యధర్మప్రభుత్వ మిదెంతకాలమో?

పిచ్చుకమీద బ్రహ్మాస్త్రమ్మను నట్లున్నదిగదా!

ఆలునుబిడ్డలేడ్వ, ప్రజలందరు జైళ్ళలొ గ్రుగ్గి చావకే
తేలికగా పొలమ్ము లొక తీరున దక్కునె?దక్కనిత్తురే?
చాలును, పేదలేదొ ఒక చారెడు దున్నుక పొట్టబోసుకో
జాలనుకొంటి, గాని యిటు చావగునంచు దలంచి నాడనే

యుగయుగాలుగా పూరకే పడియున్న బీళ్ళు, కోళ్ళు లక్షలాది ఎకరముల బంజరును ప్రజలకు పంచక, సాగునకు రానీయక, వృధాయొనర్చుచున్నది చాలక-ఎక్కడనో కడుపు సొద చల్లార్చుకొనుటకై నిరుపేదలైన కూలిరైతులు సాగుచేసుకొను చుంటూ, సెంటూ బంజర్ల లోనికి రాజకీయ బాధితులనీ,స్వాసైటే దారులనీ, కౌలుదారులనీ తమ ఆశ్రితులనూ, బంధువులనూ, భూస్వాములనూ తెచ్చి మాకడుపుగొట్టి వారికి కట్టబెట్టు చున్నారుగదా! ఎంతటి అన్యాయము?

నాగి: బాబూ ధర్మయ్యా! యీ నిర్వేదమేల? చెప్పదలచి నదేదియో స్పష్టముగా జెప్పుము.

భీమ:- చెప్పుట కేమున్నది? జైళ్ళను కుక్కియో, తుపాకుల బంపి చంపియో, పేదల నేవిధముగా నైననూ భూము లనుండి వెడల నడపుటయే ప్రభుత్వ నిశ్చయముగదా! యిక కాదని వారి నెదిరించి కయ్యమునకు దిగుటయో కాక మాసాగు భూములను కాంగ్రెసుగోత్రీకుల కప్ప గించి గంపెడంత సంసారములతో దేశమ్మ్రకాకులమై పోవుటయో రెండే మార్గములు. అందునూ- మా భూములపై మేము నిలబడిననూ ప్రభుత్వదృష్టిలో అశాంతియే. కాన కాంగ్రెస్ వారి శాంతి కనుగుణముగా దేశమ్మ్రకాకులమై పోదమనియే అన్న ధర్మయ్యగారి అభిప్రాయము.

అర్జు:- అట్లే పోదమన్ననూ చోటెక్కడ? వీరి పుణ్య మాయని ప్రాజెక్టులులేక వానరాకడ ప్రాణపోకడగా నున్న తెలుగుదేశమున నిరుద్యోగము దినదినాభివృద్ధి గాంచుచుండెనే! ఒకచోటనుండి మరొకచోటికికూలీలే గాక రైతులు సైతము వలసలు బోయి పనులులేక పస్తులే గతిగానుండెనే? యింకా పోనము పోయెడి దెక్కడికి? వల్లకాటికి.....

భీమ:— ఆ వల్లకాటిలో సైతము మనకు ఖాళీదొరుకునని హామీ యెక్కడిది? ఏ మంత్రియో సామంత్రుడో తనకూ తన బలగమునకూ కావలెనని ఆకట్టుకొన కుండా ఖాళీవుంచునని యే మున్నది?

నాగి:- అన్నా భీమన్నా! చెప్పదలచిన దేదియో పూర్ణముగా చెప్పనీయక మధ్యమున మీ హడావిడియేల? బాబూ! ధర్మయ్యా!

సంజీవరెడ్డిగారి వహో సాగము సర్వము కంటె, మందు కా
నంజను శూన్యహస్తములు,శుష్కప్రియాలును బంధ్లు; పేదకున్
గంజియెరాత, దోపిడికి కమ్మని పూత; విధానమే ప్రజా
భంజన, పాడిదప్పిన ప్రమాణము,లింతెచరిత్రయంతయున్

ఈ కాంగ్రెస్ నాయకుల, వారి అనుయాయుల వరుసయంతయూ తొలుతనుండియూ ఒకేరీతిగా ప్రజలను వంచించుటే పరమార్థముగా బెట్టుకొన్నట్టున్నది. అవసరము తీరువరకేగదా! అల్లుడు-

సంపాదించిరి రాష్ట్రమున్ ప్రజలె, తత్సంబంధులౌమిమ్ము గ
ర్షింపన్ బొల్పడిరప్డు, నేడు కపటప్రేమన్ ప్రజాస్వామ్య ర
క్షింపన్ పేరిటగద్దెలెక్కి, రటుపైమీపెంపు, మీసొంపు, మీ
కంపే గిట్టకపోయె, తెప్పపనియింకానేమి? యేర్పాటినన్.

భీమ:- ఈ కాంగ్రెస్ నాయకులు ఏ ముహూర్తమున నధికారమున నడుగుబెట్టిరోకాని ఆ 47 నుండి యీ ఏడేండ్ల లోనూ-వీరు ప్రజలకు చేసిన మేలూ చేయని కీడూ ఒక్కటున్నదా?

కూటికే చాలని కూలిరేటును పెంచు
డన్న మిల్లరి దెచ్చి తన్నినారు
పండిన పంటలో తిండికే మిగులనీ
కుండగా రైతుల పిండినారు

తమ తమ హక్కు లందగ బోరెడి జనమ్ము
నణచ హింసాకాండ నడపినారు
ఊరూర ప్రజనంత నొకచోట జేరిచి
దిసమొలల బాజార్ల ద్రిప్పినారు
భాగ్యవంతులకేదొ భయమని ప్రజలను
యీడ్చి కావిళ్ళు గాయించినారు
మన తల్లి చెల్లెండ్ర మన కళ్ళ యెదుటనే
బరితెగి నడివీధి చెరిచినారు
తెల్గుదేశాభివృద్ధికి పాటుపడు మన
బిడ్డల బట్టి కాల్పించినారు—
బరిసెలును, చింతబరికెల్, తుపాకిగుండ్లు
యేలె నీతెల్గు భువి వీరిపాలనమున
మొదటినుండియు పేదల గుదిగ గట్టి
పెద్ద మొత్తలవారి కర్పించుటె గద!
అయినవారికి ఆకులు, కానివారి
కంత కంచాలు ననెడి సిద్ధాంతమె గద॥

ఏనష్టమూ లేని జమీందార్లకు నష్టపరిహారములూ, తరతరాలుగా ప్రజల పీల్చి చంపిన సంస్థానాధిపతులకు భరణములూ, రాజప్రముఖ బిరుదములూ. మద్య నిషేధము వలన వృత్తులుబోయి యేడ్చు కల్లుగీత కార్మికులకూ, సాగుభూములనుండి గెంటబడ్డ కూలి రైతులకూ జైళ్ళు,లాఠీలు; రామరాజ్య పరిపాలనమున ధర్మము పశువువోలె నాలుగు పాదములా నడచుచున్నయది. యింకేమి కావలయును?

అర్జు:- ఎప్పటివో మాటలేల?

ప్రత్యేక రాష్ట్ర సంపాదనకైపోరు
ప్రజపైకి సైన్యాల బంపుటేమి?
రాష్ట్రమ్ము విడివడి రాగానె సిగ్గులే
కేగబడి గద్దెల కెక్కుటేమి?
'వాడవాడల బెజవాడయే రాజధా
న' న వినక కర్నూలు కరుగుటేమి?
జనులెన్నుకొన్న శాసన సభన్ ద్రోసిరా
జని నిరంకుశత పో జనుటయేమి?

ప్రజలు దేశము నేగంగ పాలుగాని,
పదవులే సర్వ మిహమును పరముగాదొ
నీతిగనరాదుపో! బంధు ప్రీతిదక్క
చట్టమే చుట్టమయి పోయె స్వార్థమునకు!-

రాష్ట్రదీక్షలో ప్రాణములొడ్డిన పొట్టి శ్రీరాములు గారి మరణమునకు కారకులైన కాంగ్రెస్ నాయకులే ఆమహనీయుని విగ్రహముల ప్రతిష్ఠించుట, పటముల నావిష్కరించుట, రాష్ట్రమును సాధించినది మేమేన నుట ఎంతలో ఎంతఫిరాయింపు? దయ్యములు వేద ముల వల్లించుట ఇదియే కాబోలును.

ధర్మ:- ఏదియేమైననూ ఒకేతీరున చెవినిల్లుగట్టుకొనిపోరినచో నిజము నిలకడ మీద తేలకపోవునా? ప్రజలకునూ ప్రభుత్వమునకునూ మధ్య వైరభావము దేమునకుశ అరిష్టదాయకముగదా!

నాగి:- ఈ యొనరించున వన్నియూ వారికి నిజము తెలియక యేనా?

ప్రజలు ప్రభుత్వమున్ ఒక ఔబాట చచరించుటమే లెకాని యీ ప్రజలను వీడి దోపిడికి పట్టము గట్టిరి. దానిచుట్టు రాం భజనలు సేయుచుంద్రి పరిపాలకు, లెక్కడిధర్మమింక? మీ నిజమున కేడకూడు? గమనించెడి కంచెయె చేనుమేయగాన్-

రామాయణ మంతయూ వినుచూ రామునకు సీత యేమగునన్నట్టున్నది. ప్రతి చిన్నసమస్యకునూ పోరాటము, జైళ్ళు తప్పుటలేదుగదా! శాసన సభలో మేమునూ శాసన సభ వెలుపల అశేష ప్రజాసామాన్యమునూ చేయు ఆందోళనకంటె యింకా చెవినిల్లు గట్టుకొని పోరుట యెట్లు?

అర్జు:- అధిక పన్నులు భరించజాలము మొర్రోయన్నవిన్నారా? బస్ రేట్లమీద సర్ఛార్జీని మానుకొన్నారా? ప్రజా బాహుళ్యమున కుపయోగించు కార్య క్రమములకు పూనుకొన్నారా?

భీమ:- నందికొండ ప్రాజెక్టును శ్రీ సంజీవరెడ్డిగారి సమాధి మీదగాని కట్టుటకు వీలులేదన్నాడు గదా!

అర్జు:- బంజరులను పేదలకుఉచితముగా పంచవలసినదనియూ మద్యనిషేధ విషయమున రామమూర్తి కమిటీ సిఫారసుల నమలుజరుప వలసినదనియూ, శాసన సభ విస్పష్టముగా తీర్మానించినది. ఆపైన బంజరు సాగుదార్లనూ, కల్లుగీత కార్మికులునూ వేలనంఖ్యలో

సత్యాగ్రహము చేసి జైళ్లకరిగినారు, ఐననూ మంత్రులకింకా నిజము నిలకడమీదగాని తెలియదన్నమాట. అంతటి చెవిటి ప్రభుత్వము అధికారమునకనర్హమే!

భీమ:- అచ్చుగా చెవుడుగాదు. గ్రుడ్డికూడా. అది-అధికార గర్వపూరిత బధిరాంధము అదియునూ అన్నప్పుడూ కాదు. పంతుళ్ళు, చిన్న ఉద్యోగులూ జీతములు పెంచుమన్నప్పుడది వినపడదు. డబ్బుకనపడదు. మంత్రులు 500 రూపాయలకంటే తీసికొనరాదని అసెంబ్లీ చేసిన తీర్మానమునూ వినబడదు. వేయికి తక్కువ తీసుకొనరాదన్న వినపడును. డబ్బునూ కనబడును.

అర్జున:— భూస్వాములూ వారిబంట్లూ ఎద్దు యీనినదన గాటగట్టి వేయుమని పోలీసులబంపెడి మంత్రులు ప్రజల యెడ జరిగించు అపచారములన్నియూ నిజము తెలియకనే నన్నమాట. ఎంతటి అమాయకము!

నాగి:- అమాయకము వారిదికాదు మనది...

మాకారోగ్యము, సుఖమున్
మాకాయుష్యంబు, ఘనము, మాకె ధనంబున్
మీకో? 'నాశనము'ను తెర
గీ కాంగ్రెసు పాలసీల కెంతేని తగున్

అని నుండియూ 'నీకంటిలో నేను వ్రేలుంచెదను; నా నోటిలో నీవు వ్రేలుంచు'మనుటయేగదా !

భీమ:- అక్షరాలా అంతియే. శాసనసభా తీర్మానములను అమలు జరుపవలసిన మంత్రులే శాసనధిక్కారముగావించి పైగా

శాసనసభా తీర్మానముల నములు జనుపు గీత కార్మిక
లనూ, బంజరుసాగుదార్లనూ శాసనధిక్కారమొనర్చు
చున్నారని జైళ్ళకుక్కి హింసించుచుంట చూచుచునే
యుంటిమిగదా!

ధర్మ:- అది రాజ్యాంగయంత్రము. పోలీసులు, జైళ్ళు వాని
దగిన కోర్టులు; డాబూ, దర్పమూ సర్వమూ గల
భూస్వామి లోకవైపున. యిక మనమా? కూటికి లేక
మొర వినువారులేక నిలువునా మాడి చావవలసిన
వారము. దొరలతో మనకు పోటీలా?

అర్జు:- అన్నా ధర్మయ్యా!
దొరల మటంచు రాజసముతో తెగనీల్గి, కుషన్ చెయిర్లలో
బారలు దినమ్ములన్నియును పోయె, ప్రపంచము మారిపోయె,ము
ష్కరత ప్రభుత్వమీ ప్రజలగాదని కన్నులు మూసికొన్న,యీ
నరుల సమైక్య కంఠ జయనాదమె నిద్దుర దుల్పి తెల్పెడిన్-

భీమ:- ఆఁ! ఏమీ ?
దొర యొక్కండని యేటిమాటలు? ఎవండే దున్ను నవ్వానిదీ
ధర, పోరాడుద మీయధర్మ ప్రభుతన్ తప్పించి,సామాన్యులం
దరు స్వేచ్ఛన్ తమహక్కులందన్; నటుకాదా! చచ్చిపోనేమి?యీ
లిటి పెంపుంబ్రతు కేడ, కూడుదినకే దీర్ఘాయువై నిల్చునో?

మాకష్టముచే సృష్టింపబడిన సర్వసంపదలనూ అను
భవించుచూ, మమ్ములను సర్వ సౌఖ్యములకూ దూర
ముగా కొట్టినది చాలక, ఎంతటి యీసడింపు ? ఔరా !

కుక్కల కన్నను, మమ్ముల
తక్కగ జూచెడి పరాన్న భుక్కులదా, త
త్రిక్క వదిల్చెడి సుదినం
బొక్కటి రానుండె, కొంచెమోపిక చాలున్,

నాగి:- ఔనౌను. ధర్మయ్యా! మీబల పరాక్రమముల నీవే
యెరుంగనిరీతి మాటాడుచున్నావు. కాని

నాల్గు పయోధులోయనగ, నాలుగు దిక్కులోయనంగ, మీ
నల్గురు కూలి రైతు ఖిలనా డొకలై నిజధర్మరక్షకై
యల్గిన నెవ్వ డాపగలడయ్య! ప్రజల్ కను విప్పుదాక నే
వెల్గెడి నీ కితాబు, లటు విప్పిన నారెకుపో! మతాబులై

భీమ:- నిశ్చయముగా నంతియే!

ధర్మ:- గోటితో బోవ నీలగుచో గొడ్డళ్ల దాక నేల? సామము
ననే సానుకూల పడుచో యిర్వురకునూ క్షేమమే గదా!

నాగి:- ఎలుకతోలుదెచ్చి ఎన్నేళ్లు వుదికినా
నలుపు నలుపేగాని తెలుపుగాదు
మనిషికొక్కమాట మంత్రుల కట్లానో?
విశ్వదాభిరామ_వినుర వేమ!

ధర్మ:- కావచ్చును. కాని_

ఇంతకు మాదుగోడు వినసీ, వినకుండగనీ; మనంబు ని
శ్చింత మగున్, జనం బెవరిచేష్టలు చెడ్డవో తేల్చుకొంద్రు,నిం
దింపరు మమ్ము, నమ్మరిక వారి, పదింబదె బల్కు దొంగ వే
దాంతపు శాంతి భద్రతలు, దాంతి యహింసలు తేటతెల్లమౌ.

ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానములకు తాము నిజమైన వ్యతిరేకులమనీ, ప్రజాస్వామ్యపక్షులమనీ, నిరంతరమూ చెప్పుచూ, ప్రభుత్వమునకుఅనుగుణసహకారమూ, విమర్శనాయుతసహకారమూ ఇచ్చుచున్న లోక్, సోషలిస్టు, ప్రజాపార్టీ, తదితర స్వతంత్రులూ వినుచుండ ఆశాసన సభా మంటపమున ప్రకాశమే ప్రజలూ, ప్రజలే ప్రకాశము గారితో సావకాశముగా నీ అన్యాయ విధానముల వివరించిన నెట్లుండు నోయని—

నాగి:— అట్లే కావింతము. ఇంతకూ సంధి యేమనీ ?

ధర్మ:— సంధివచనప్రస్తావంబున వారితోనిట్లనుడు. కరాచీకాంగ్రెస్ మహాసభా వేదికనుండి 'దున్నేవానిదేభూమియనీ అందుల కడ్డుగా జమిందార్లూ సంస్థానాధిపతులూ; వారి రక్షకుడుగా బ్రిటిష్‌సామ్రాజ్యవాదపిశాచముఉన్నదనీ దిక్కులు పిక్కటిల్ల నినదించినవారుమీరు. నాటినుండి నేటి వరకునూ ప్రతి ఎన్నికలప్రణాళికలోనూ 'మాకు వోటిచ్చి మమ్ము అధికారము లోనికి పంపినచో భూస్వామ్య విధానమును రద్దు చేయుదుమనియూ ప్రజలకు భూములిచ్చెదమనియూ వాగ్దానము చేయుచునేయున్నారు' గదా!

దున్నే వానిదె ధర, సం
పన్నుల భూములనె ప్రజకు పంచెదమం చం

టున్నారటు; యిటు-పేదలు
దున్నినదే దోచబెట్టు తున్నారుగదా!

మాటలకూచేతలకూ ఎంతటి వైరుధ్యము? భూస్వాముల భూములకుగరిష్ట పరిమితి నేర్పరచి పేదలకుపంచుటకు మాచిత్తము లెటూ అంగీకరించవు. అట్టియెడ ప్రభుత్వ బంజర్లనైననూ పేదలకు పంచి యిమ్మంటిమనియూ, అందుకునూ ఒప్పరేని పేదలు సాగుజేసుకొనుచున్న భూములనైనా వారికి దక్కనిమ్మని బ్రతిమాలుకొంటి మనియూ నా వచనములుగా జెప్పుడు.

నాగి:- భీమన్నా ! నీవేమందువు ?

భీమన్న :- వేరే అనుటకేమున్నది

నీరెవ్వారలు మాదునేల నడుగే న్వెట్టంగ? క్రొన్నెత్తురుల్ బారన్ బాడవ లీడవల్ సరిది, తుప్పా దుగ్గి గానున్న కీ కారణ్యమ్ముల పంటభూములఁగ తేగా; నేడిటుల్ కొల్వ్రు సిం గారమ్మైకుడువంగ బుట్టిరె దొరల్ ? కాంగ్రెసు వేసమ్ములన్।

రాజకీయబాధితులట. దేశసేవకు ప్రతిఫలము బుచ్చుకొనుట యిదెక్కడి విశేషమో! స్వాతంత్ర్యపోరాటమున అనేక బాధలుపడిన ప్రజలెవరు? పన్నుల నిరాకరణోద్యమము నాటి పలనాటి, పెదనందిపాటి ప్రజలు, 1942 లో సాముదాయక జరిమానాలకు, చిత్రహింసలకూ గురియైనవారు రాజకీయ బాధితులుగారు! ఏనాడునూ కాంగ్రెసు మొగమైననూ ఎరుగకున్ననూ పైవారి ప్రాపకమున్నచో రాజకీయ బాధితులే.

ఎవరికో పుట్టుబిడ్డను యించుకంత
సిగ్గుశరమేని లేక వాంఛించు బుద్ధి
మంతులతో సంధి యాశ ఆవంత లేదు
ఐనఁ గావింతమన్న కాదనుట జనదు

బంజరు తీర్మానమునూ, మద్యనిషేధ రద్దు తీర్మానమునూ ఉన్నదున్నట్లుగా అమలు జరుపుట మర్యాదయనియూ, కానినాడు ప్రజలమైన మేమే గద్దెలనుండి మిమ్ము క్రిందికి దింపి, అధికారమును హస్తగతముచేసి కొని అమలు జరిపెదమనియూ, అట్టిదు రవస్థపాలు గాకుండ ముందే మేల్కొనుట క్షేమమంటి ననియూ చెప్పుడు.

నాగి:- అర్జునరావ్ ! నీయభిమతంబేమి?

అర్జు:- ఏమున్నది ?

బంజరులు సాగునకు రాక పగ్రలట్లు
పాడు బడియుండ నెవరికి పట్టదాయె
కష్టపడి రక్తమోడ్చి బంగారు పొలము
జేసికొన వారికిట్టి దురాశ పుట్టె

లంక భూములనూ బంజర్లనూ మార్కెటు రేటున కమ్మెదమనియూ, వేలమునకు పెట్టెదమనియూ ప్రభుత్వము పలుమార్లు ప్రయత్నించినదియూ; రాజకీయ బాధితులు, సొసైటీదార్లు, దురాక్రమణకు దిగినదీ ఎప్పుడు ? పేదలము వండ్లుతరబడి అష్ట

కష్టములుపడి అధిక శిస్తులు, అపరాధములూ చెల్లించి సాగునకు తెచ్చిన తరువాతనేగదా ?

ఏండ్లు పూండ్లు రక్తమింకించి, చమ్మటల్
గార, దున్నుకొన్న గడ్డ యిద్ది,
బిడ్డ, పాప, కన్న ప్రియమైన బంధమ్ము;
వీడు నెవడు ? చచ్చునాడుగాక !

కావున వీరెంతటి దౌర్జన్యములకు దిగిననూ, ఎన్నిహింసల పాలుజేసిననూ భూములను విడుచుటన్న మాటయేలేదు కాని యీనాటి సమస్యబంజరుభూముల సమస్య మాత్రమే కాదుగదా! మాటి మాటికీ ప్రజాస్వామికముపై తెగబారెడు ఊకదంపుడుఉపన్యాసములదంచు వీరు, ప్రజలెన్నుకొన్న శాసనసభ చేసిన నిర్ణయములకుతలఒగ్గుదురా లేదా?యనునదిముఖ్యము. 'గుడినేమ్రింగు వానికి గుడిలోని లింగమెంత' ? యని అన్నివర్గముల ప్రజలెన్నుకొన్న శాసనసభనే కాల దన్ను వారికి యిక-ఒక వర్గమునకు చెందిన ప్రజలొక లెక్కా? కాన మొదట శాసన సభ ఆమోదించిన మద్యనిషేధ తీర్మానమును, బంజరు తీర్మానమునూ అమలు జరుపమనుడు. వివిధ సత్యాగ్రహులనూ జైళ్ళనుండి విడుదల చేయుమనుడు. కాదేని గద్దెలనుండి దిగి రమ్మనుడు. శాసనసభను, ఆవిధముగా ప్రజాభిప్రాయమును, మన్నించగలవారే అధికారమునకు వత్తురు.

నాగి:- మంచిదియ. కాని చిన్నవారైన కవలలున్నచో వారేమి చెప్పెడివారోగదా!

ధర్మ:- నిష్కారణముగా వారు జైళ్ళలో గ్రుగ్గుచుంటిరిగదా ! బంజరు, కల్లుగీత సత్యాగ్రహములకేగిన వారేమి చెప్పెదరో వేరే యేల తెలిసికొనవలయు?

తెరలో: ఆసన్నంబయ్యెను గద !
శాసనసభ సమావేశ సమయము; నేడే
శాసన సభ్యులు, కర్నూల్
పాసింజరు కేగ పయనమగుచుండిరదే !

నాగి:- (ఏదోపరధ్యానముగా ఆలోచించి నట్లుండును)

ధర్మ:- బాబూ నాగిరెడ్డీ ! ఏదేని ప్రమాదమును శంకించుచుంటిరా ?

అర్జు:- తిమ్మారెడ్డిగారు 'కమ్యూనిస్టు పార్టీని కాలరాచెదననీ, దిక్కేన్వడనీ' కేకలు బెట్టుచుండెను గదా !

భీమ:- అదియూ నిజమే. వారెట్టి ఘాతుకముల కైననూ తగుదురు. రాజధానీ నిర్ణయ సమయమున చూడలేదా! యిప్పుడుగూడా-మన సలహాను వారెటూ పాటింపరు. అట్టియెడ అధికారము నుండి దిగరండని అవిశ్వాస తీర్మానమును ప్రవేశ పెట్టుచో యేఘోరములకు దిగుదురో!

నాగి:- అశేష తెలుగు ప్రజాసామాన్యము మన యండ నున్నంతవరకూ మనవంక కన్నెత్తియైన చూడజాలరు

న్యాయమన మండిపడెదు వినాయక వరు
లయ్యీరే, మన మంత్రులా అయ్యలిద్ది
విందురో లేదో! యనువొక్క సందియంబె
కాని, యేముందు? వేరొండు గండ మిందు!

ఏది యెటులున్ననూ
ఐనను పోయివత్తు కరునూలున, కచ్చుటపొందు మాట యె
ట్లైన-ప్రభుత్వశక్తి, ప్రతిపక్షముతాల ప్రజానురక్తియున్
గానగవచ్చు, కొందరిభ్రమల్ తొలగించనువచ్చు; మీసమా
ధానము, వారివారల విధానము వింద్రు జనంబులెల్లరున్!

సోదరులారా ! నాకింక సెలవిందు.

గతము మనమంత పడ్డట్టి కష్టములను
యింక నెన్నాళ్లో పడబోము, యిది నిజమ్ము!
దాపయెను దోపిడీగాండ్ర పాపకోర
లూడ బెరికి, ప్రజల్ సుఖపడుదినమ్ము

(అందరూ నాగిరెడ్డిని సాగనంపు చుండగా తెరపడును)

ప్రథమాంకము సంపూర్ణము

# ద్వితీయాంకము

## ఇందలి పాత్రలు

శ్రీ స్పీకరు

| | |
|---|---|
| శ్రీ ప్రకాశం | ★ |
| శ్రీ విశ్వనాథం | శ్రీ నాగిరెడ్డి |
| శ్రీ సంజీవరెడ్డి | శ్రీ లచ్చన్న |
| శ్రీ తిమ్మారెడ్డి | శ్రీ రాజు |

స్థలం: అసెంబ్లీ హాలు

సమయం;- 1954 నవంబరు మొదటివారం

[మధ్యమున అధ్యక్షుని సింహాసనముండును. దాని కెదురుగా పెద్దటేబులూ, దానికిరువైపులా—కుడి వైపున ప్రభుత్వ పక్షమునకూ, ఎడమవైపున ప్రతిపక్ష మునకూ సీట్లు అమర్చియుండును.]

తెరలేవగా అధ్యక్ష స్థానమున శ్రీ స్పీకరూ ప్రభుత్వ పక్షసీట్లలో శ్రీ ప్రకాశం, శ్రీ విశ్వనాథం గార్లూ, ప్రతిపక్ష సీట్లలో శ్రీ లచ్చన్న శ్రీ రాజుగార్లు ఉపవిష్టులైయుందురు. వరుసగా శ్రీసంజీవరెడ్డి శ్రీతిమ్మా రెడ్డిగార్లు అరుదెంచి ప్రభుత్వపక్షమున ఒకేయాసనము నధిష్టింతురు.

[శ్రీనాగిరెడ్డిగారు ప్రతిపక్షస్థానమునకు వచ్చి చూసే-]

నాగిరెడ్డి :- ఈమన శాసనసభా విశేషముల దిలకింపగోరి నానాదిక్కులనుండి ప్రజలనేకంబుగా వచ్చియున్నారు ముందు వారికా యవకాశము గల్పించుట యుక్తము

తిమ్మారెడ్డి:- (ఓరగంటజూచుచూ) మాటి మాటికి రైతు కూలీ జనంబుల మందల మందలుగా దెచ్చి మానెత్తి పైనెక్కించ మను కొంటివా ? యీవచ్చువారికందర కూచో చెక్కడ ?

నాగిరెడ్డి:- చేత్రాడు చాలదని బావినే పూడ్చునట్లున్నది. ప్రజలు తామెన్ను కొన్న ప్రతినిధులమైన మనముఏమి చేయుచుంటిమో, ఏమిచేయనుంటిమో, వినుటకైనా నోచుకొనలేదా? చాలీచాలని భవనములు గల కర్నూలును వరించునాడు తెలియదా ?

సంజీ:- కర్నూలును వరించి మేము బావు కొన్నదిమాత్రమే మున్నది? స్వర్గమునకు బోయిననూ వడియేకులు తప్ప వన్నట్లు కర్నూలువచ్చిననూ యీప్రజలగోడవ తప్ప నేతప్పదాయె. యీవచ్చెడివారికందరకూ చోటెక్కడ. మర్యాదా మంత్రీలేనిచో వచ్చినదారిని తిరిగి వారే చక్కా బోదురు.

తిమా:- పోకున్న 144 సెక్షన్ వుండనేవున్నది.

నాగి:- చీటికీ మాటికీ ప్రజలపై 144 వుపయోగించుట యిదె క్కడి న్యాయము?

తిమ్మా:- శ్రీ బ్రిటిష్ వారి నాట నుండియూ సాంప్రదాయ
ముగా వచ్చుచున్న న్యాయమేఅది-

(బయట కోలాహలము)

తెరలో సిగ్గు సిగ్గు అని వినబడును

తిమ్మా: ఊ ! యేమది ? (హుంకరించును)

స్పీకర్: సైలెన్స్. నిశ్శబ్దము అబ్బ ! యేమిగోల (పెద్దగా)
నిశ్శబ్దం. నేను స్పీకరును గదా ! నామాటను ఎవ్వరూ
పాటించరైరి.

విశ్వ: హానరబుల్ స్పీకర్ ! ప్రజాస్వామికయుగములోని
పార్లమెంటరీ సాంప్రదాయములో స్పీకరు ఆజ్ఞను అక్షు
రాలా పాటించడం అతి ప్రధానమైనది. ఇది బ్రిటిష్,
అమెరికన్ పార్లమెంటు....(పుస్తకాలకోసం వెతుకును)

స్పీకర్: సైలెన్సు

సంజీవ: ఇపుడా సాంప్రదాయము పాడైపోయినది.

తిమ్మా: అవును. పాడయిపోయినది.

సంజీవ: బీడైపోయినది.

తిమ్మా: అవునవును. బీడైపోయినది.

స్పీకర్: ప్రజాస్వామికమును పడిపోకుండా పట్టుకొనుటకు
నాకొకటే దారి కన్పట్టుచున్నది.

సంజీవ: ఒకేదారి గోదారి.

స్పీకర్: సైలెన్స్-ఆర్డర్ ఆర్డర్!

తిమ్మా: అవునవును. గోదారి.

స్పీకర్: ఆర్డర్ ! నేను ఆజ్ఞయిచ్చితినిగదా నిశ్శబ్దమని... ఆ నిశ్శబ్దమును నేనైనా అమలుజరుపుకొనెదను (మౌనముగా నుండును.

[అందరూ అనుకరింతురు. స్పీకరు ప్రకాశంగారి చెవిలో ఏదో మాట్లాడుచుండగా]

విశ్వ : ప్రజాస్వామికయుగములోని పార్లమెంటరీ సాంప్రదాయములో అతిప్రధానమైనది...

స్పీకర్: (రహస్యముగా మాట్లాడుచునే) ఆర్డర్ ! ఆర్డర్ ! (కొంచెమాగి) నాగిరెడ్డి! యిప్పటికిప్పు డెట్లునూ భవనములను పెంచలేముగదా ! కనుక బయటకు వినిపించునట్లు లౌడ్‌స్పీకర్లను ఏర్పాటుచేయించెదము. చెట్లనీడనుండి ప్రజలు వినవచ్చును.

నాగిరెడ్డి: అట్లైననూ కానిండు.

సంజీవ: మీరు చెట్లు పుట్టలు, పట్టుకొని వ్రేళ్ళాడుట అలవాటేగదా !

తిమ్మా : అవునవును. అలవాటేగదా!

నాగి : మీపాలనమున అంతేమరి.

స్పీకర్: ఆర్డర్! అయ్యయ్యో- మరిసభనుప్రారంభింతము. యిక అంతా సంసారపక్షముగా సాగిపోనిత్తము.

నాగి : అయ్యా ! ప్రధానమంత్రీ ! ప్రకాశంగారూ, ప్రభుత్వమునకునూ ప్రజలకునూ మధ్య వైర వైరుధ్యములుం

డుట దేశారిష్టమునకు మూలహేతువు. ప్రజాప్రభుత్వమను పేరునకే తగనిది. యీనాడు బంజరు సాగుదార్లునూ, కల్లుగీత పనివారునూ, ఇనాందారీ రైతులునూ సత్యాగ్రహము లొనర్చుచుండుట మీరెరుగనిదికాదు. జమీందారీ ఇనాందారీ విధానమును రద్దుచేసి భూసంస్కరణలు గావింతుమని మీరు పాతికేండ్లుగా చెప్పుచున్నమాటలేగదా! అంతవరకు లేకున్న మానె. ప్రభుత్వబంజర్లనైననూ పేదలకు పంచుట; కనీసముసాగుపొలములనుండి బయటకు గెంటకుండుట పరమధర్మము, అటులనే కల్లు గీతపనివారలకువృత్తులు కలిగించుట. ఈ విషయమై ప్రజాప్రతినిధులతో కూడిన శాసనసభ తీర్మానముకూడా చేసినది. అట్టియెడకాదని మీరు పట్టుబట్టి ప్రజలను జైళ్ళకు పంపుట అన్యాయము- అక్రమము- చట్టవిరుద్ధము కూడ. కనుక ప్రజాభీష్టమును మన్నించి, శాసనసభా తీర్మానములను గౌరవించి ప్రజలెల్లరు సుఖంబుండునట్లు పరిపరిపాలన గావింపుడని యాచించుటకై ప్రజల పనుపున నిటకు వచ్చితిమి.

అనిన మాటకు నిలబడు డంతె యనిరి
మావి మాకివ్వ నదె, బహుమానమనిరి
కాకులను గొట్టి గ్రద్దల కీకు డనిరి
కాదటన్న పోరాటమే ఖాయమనిరి.___

ప్రజలు మిమ్మేల కోరిన దింతమాత్రమే !
మంత్రుల వినిపింతో ? యీ
మంత్రులతో నేమియని స్వతంత్రింతో ? ప్రజా
తంత్రముగ నడుము-లేదో

మంత్రిత్వమ్మేలకె ఎసరు ముసురుట నిజమా॥
ఫలితార్థంబు మాత్రమే చెప్పితిని. అల్లు చేయదలంప వేని

ప్రకా:- బిడ్డా! నాగిరెడ్డి! అన్నియూ యెరిగియుండియూ
నెపమును నాపై వేయజూచుచున్నావు.
గ్రుడ్డివానిజేసి కొద్ది కాలానికే
దింపిరపుడు, యిపుడు దింపగలరు.
నేనిమిత్త మాత్ర మీనాడు, ఏనాడు
గ్రుడ్డిదయ్యె మాటకూడ-నేడు.

యికవారిని వినిపించి ఒకే బాట నడుపు విషయమా?
నాయకు లనుచరు లొకటిగ
బోయెదరనుమాట గాంధి పోయిననాడే
పోయెను, చెప్పెడిదేమిక ?
పోయిన వాటికయి వగవ పురుషార్థంబే !

రాజు:- గాంధిజీ పోయిననాడే పోవుటయేమి ? గాంధిజీపోక
ముందే మీరందుకు ప్రారంభోత్సవము చేసితిరిగదా!
మద్రాస్‌లో మంత్రిపదవి పోయినంతనే గాంధిజీకి,
ఎదురుతిరిగి కాంగ్రెస్ పై కత్తి గట్టలేదా?

ప్రకా:- ఔనోయ్! నేనే. ఆ తర్వాత రంగాతో కలిసి ప్రజా పార్టీ పెట్టినదీ నేనే. కాదని వేరేపోయినదీనేనే. కమ్యూనిస్టుల్ని తిట్టినదీనేనే. వారితో కలిసి ఫ్రంటు కట్టినదీ నేనే ఆఫ్రంటును చీల్చినదీ నేనే. నీ సోషలిస్టు పార్టీలో తలదూర్చినదీ నేనే. కాదన్నదీ నేనే. ఆనాటి నుంచి యీనేటిదాకా కాంగ్రెసును దుమ్మెత్తిపోసిందీ నేనే. యిప్పుడు కాంగ్రెస్ కోటలో పాగావేసిందీ నేనే.

రాజు:- అది అంతా ఏ నీతి ?

ప్రకా:- ఆఁ ! నీతిగాదూ ! ఆ నీతిలేని నన్ను వేధించి ఫ్రంటు నుంచి బయటికిలాగి సోషలిస్టుపార్టీలో చేర్చేదాకా కాలుగాలిన పిల్లిలా తిరిగితివే ! అది ఏ నీతి?

రాజు:- మంత్రి పదవి కోసం ఎన్నయినా తలలు మార్చుతా రన్నమాట !

ప్రకా: అన్నమాటేగాదు ఉన్నమాటేఅది......ఫ్రంటులో నుండి చీలినేనూ నీవూ ప్రజాసోషలిస్టుల మయింది అందుకోసంగదూ? రాజధాని విజయవాడవద్దని మన మంతా అన్నది అందుకోసంగదూ? పార్టీగా గాకుండా నాకూ విశ్వనాథంకూ, మంత్రిఇస్తామనబట్టి నీకుప్రాథాన్యత పోయింది గాబట్టి అందని ద్రాక్షపండ్లు పుల్లపై ప్రతిపక్షం అంటున్నావు. కాని లేకపోతే మనమంతా ఒకేపక్షం మనదంతా ఒకటేనీతి...గ్రుడ్డువచ్చి పిల్లని వెక్కిరించినట్లు గురివిందగింజ ఉపన్యాసాలు కట్టిపెట్ట

వయ్యా, విజయనగరం మహారాజా (ఎకసక్కెముగా)
పదవులకోసం పార్టీలు మారుస్తావా ?! ఛీ!

సంజీవ: ఏమిటీ అనవసర వాగ్వివాదము ?

తిమ్మా: అవునవును. అనవసర వాగ్వివాదము ?

చెన్న: అహా! ఏమిప్రభుభక్తి! గుమ్మడి కాయలదొంగ బుజాలు తవుడుకొన్నట్లు మంత్రిపదవి కాశపడి మా రంగాపార్టీనుంచి కాంగ్రెస్‌లో దూకిన నీకు, ఒకపార్టీ నుంచి మరొకపార్టీలోకి పదవుల లంచాలుబెట్టి మార్పుళ్లూ, తార్పుళ్లూగావించే సంజీవరెడ్డికి వాగ్వివాదము అనవసరముగా నున్నదేమి?

(తిమ్మారెడ్డి హూంకరించును. సంజీవరెడ్డి ఆపును)

రాజు: భేష్ భేష్

స్పీకర్: నిశ్శబ్దం...

విశ్వనా: ఏమయ్యా! విజయనగర మహారాజా! ఫ్రంటునుండి చీల్చి సోషలిస్టుపార్టీలో చేర్చుకొనుటతార్పుడుకాదా?

సంజీవ: నీవు నేర్పిన విద్యయే నీరజాక్షు...

విశ్వనా: క్రింది నలుపు తెలియని గురివిందగింజా! సోషలిస్టు రాజా!

స్పీకర్: నిశ్శబ్దం. విశ్వనాథంగారూ! స్పీకర్ను ఆజ్ఞను—

విశ్వనా: అవును. స్పీకరు ఆజ్ఞను అక్షరాలా పాటించుట ప్రజాస్వామికసూత్రాల ప్రప్రధాన సాంప్రదాయం. ఏదీ బ్రిటిష్, అమెరికన్ పార్లమెంటరీ...

స్పీకర్: ప్రకాశంగారూ! మీరింకా చెప్పవలసిన దేమైనా వున్నదా ?

ప్రకా: అబ్బాయీ! నాగిరెడ్డి! నేనొకటేచెప్తున్నా విను. ప్రజాస్వామికమో, పాతచింతకాయ పచ్చడో నాకదంతా తెలియదు. నాకిప్పుడు ప్రజాతంత్రమూ లేదు, ప్రజలూ లేరు. సూత్రాలూ లేవు, నేత్రాలూ లేవు... ఈసంగతే వర్తకుల మీటింగులో చెప్పేశానుకూడా. ఆరోజుల్లో అన్నారు! అప్పుడు...ప్రకాశమంటే ప్రజలు, ప్రజలంటే ప్రకాశం. అది కుర్రతనం. ఉన్నది పోగొట్టుకోవడమే తెలుసు. త్యాగమూర్తి ప్రకాశం, ధీరమూర్తి ప్రకాశం, ఆంధ్ర కేసరి ప్రకాశం, అంతా ప్రకాశమే— గాంధీగారితోపాటు నాకూ బ్రహ్మరథం పట్టారోయ్ బ్రహ్మరథం......

నాగి:— (తనలో) ఈ ముదుసలి అసలు విషయమును దాట వేయజూచుచున్నాడు. (ప్రకాశముగా) ఎరుగుదును. కాని—

'చదువున్, భాగ్యము, సర్వమున్ విడి; యహిం
సా, సత్యదీక్షావిధిన్
బ్రదుకన్, ప్రజ్ఞలుగొన్న ప్రాజ్ఞుల'ని గ
ప్పాల్ గొట్టుకోదగ్గ, సం
పదకున్, వారసులే గదయ్యా! మరి మీ
వారంత? ఆపాత పు
ణ్యాదయా బిచ్చపు, బొచ్చె, బోర్లబడనీ
కయ్యా వృధాస్పర్థకై'—

4)

ఉ॥ అట్టి ప్రజాభిమానమున, నట్టి మహాత్ముడు గాంధిజీకి తో
బుట్టిన వాడుగా యశము బొంది, ప్రకాశము వైన యట్టినీ
కట్టిన పాపమెట్టిదియొ ? కష్టపు కాలమువచ్చు, వీరలం
బట్టి, యిదెట్టు లీగెదవొ పార్థివ సత్తమ! నీతివిత్తమా!

ప్రజాభిప్రాయమును మన్నించి, ప్రజానసరములదీర్చి ప్రజలచే జేజేలు పెట్టించుకొనెదరో గాక మరేదేని కొట్టించుకొనెదరో అది మీాయందునూ మీాచేతల యందునూ వున్నయది. ప్రజలుమాత్రము ఇందుకునూ, అందుకునూ సంసిద్ధులే.

తిమ్మ: ఓయీా దౌర్జన్యవాది! నాగిరెడ్డి! అతడు పాపమే గట్టెనో, పుణ్యమేగట్టెనో అది నీ కనవసరము. అధిక ప్రసంగమొనరించుటకు నీకీ హక్కెవ్వరిచ్చిరి ?

లచ్చన్న: ఓయీా పదవీవ్యామోహపీడితా! తిమ్మరాయా! నాగిరెడ్డి మాట లటుంచుము. ఈ అధిక ప్రసంగమునకు నీ కెవ్వరధికారమిచ్చిరి ?

చెప్పగ బూనిన విషయం
బొప్పో తప్పో ముగింపకుండగ నడుమన్
తప్పనుచును తెగబారెడు
చెప్పంగా వచ్చినావె సిగ్గటు లేదో ?

తిమ్మ: మంత్రిత్వముతోపాటు మతిగూడా పోయినదేమి ?

మంత్రిత్వమ్మునొసంగి, కాచు, విభునే మాయాపిమోవచ్చిస్వా
తంత్ర్యంబున్నటు తిట్టిపోయ, సయిపన్-తాత్రాజుపేతాళ్లునే
మంత్రిన్, తిమ్మయ పేరుకుందగినహన్మంతుండ,తంత్రాలు యే
మంత్రాలున్ కొగగావు ప్రాణమిడెదన్ సంజీవరాడ్మంత్రికై.

లచ్చన్న: అవును. పొట్టకూటికాసించి గుమ్మమున పడియుండు ప్రవృత్తినే ప్రకటించుకొన్నావు. మంత్రిత్వము నొసంగిన మాత్రమున సంజీవరెడ్డికై ప్రాణమైనను పెట్టెదవా? మేమట్లుగాదే? న్యాయపక్షపాతులము. ప్రభువుల చిత్తము ననుసరించి నడచుపని మాకు లేదు.

విశ్వ: ప్రభువుల చిత్తము ననుసరించుట బానిస ప్రవృత్తియే యైన నీ చరిత్ర మాత్రమేమిటి ?

రాజు: ఓహో! తిమ్మారెడ్డియు, నీవును ఒకేవిధముగా తలలు మార్చిన ప్రముఖులగుట చేతనేమి ? ఒకొరి కొకరు అండగా పెనవైచుకొనుచున్నారు ! రక్కలు ముక్కలుచేసి బ్రతికెడు రైతు బిడ్డలను నిలువునా దోచుకొనెడి ఈనాందారీ దోపిడిదార్లకు నాయకుడవైన నీవునూ న్యాయసూత్రములు వల్లింప, దగుదునమ్మా యని వచ్చితివా ?

విశ్వ: నేను యీనాందార్లకు నాయకుడనే. నీవెవ్వరవు ?

సంజీవ: తన ఎస్టేటులోని రైతులకు రక్షణ వల్లగాదని హైకోర్టులో దావాలు వేసి కరివెన రైతులకోసరం పోరాటం ప్రారంభించిన విజయనగరమహా...రా...జు!

తిమ్మా: ఎవరూ! (చేయిముఖమున కడ్డుగానుంచి చూచునట్లు నటించుచు) ఓహో

అతడు పీ. వీ. జి, రాజ ? సత్యాగ్రహమ్ము
సమరమని దూకి, జైళ్ళకుసాగి, మధ్య
రేసులో అలసిన కంఠ శోషలిస్టు
కోలుకొనె నేమి ? మొనమొన్న నీలగిరిలో.

రాజు: ఏమీ? సత్యాగ్రహమ్మునే ఎకసక్కెము చేయుచుంటిరిగా! సత్యాగ్రహము మీరందరూ చేసినదేసుమా!

విశ్వ : ఎకసక్కెము గాదు. అది ఇప్పుడేమైనట్లాయని ?

తిమ్మా: నీలగిరిలో మరచిపోయి వచ్చినట్లున్నాడు.

విశ్వ : లేదు లేదు. జైలు నాలుగుగోడల మధ్యనే_

ప్రకా : ఎందుకోయ్ అదంతా_ నేను చెప్పానుగదూ! పి.వి.జి. రాజు అలా జైలుకు వెళ్లి వస్తానన్నాడు. పోయిరమ్మన్నానని. వద్దనుకున్నాడు, మానుకున్నాడు. అది తన కోసం. తనపార్టీకోసం_ తనయిష్టం

రాజు: (చిన్న మొగం చేసుకొని) మీరు ఆచట్టం చేస్తామంటే మేము మానుకొన్నాము.

సంజీవ: మేమెప్పుడూ అనలేదు.

తిమ్మా: అవునవును. అనలేదు

రాజు : మీ కాంగ్రెస్ కమిటీ తీర్మానించినది.

సంజీవ: ఎంతటి కుర్రవాడివయ్యా రాజు! చేసిన తీర్మానములను ప్రభుత్వం అమలు పరచవలెననిఎక్కడ? ప్రజాభిమానము సంపాదించేందుకే తీర్మానములు. గాని అమలు పరచేందుకా?

నాగిరెడ్డి: నీతిగల పార్టీయేదీ అట్లుచేయదు

సంజీవ : మాపార్టీ అలాగే చేస్తుంది, సోషలిస్టుపార్టీ మాత్రమేనా?

స్పీకర్: ఆర్డర్! విషయమును వదలి వేరుగా వెళ్ళుచున్నారు సంసారపక్షముగా సాగిపోనివ్వండి నాగిరెడ్డీ! ఏమట్టు లూరుకొన్నావు?

నాగిరెడ్డి: సంజీవరెడ్డిగారి సభారంగము నెమ్మదిగా యుద్ధరంగముగా మారుచుండెనేయని. బావా సంజీవరెడ్డీ! ప్రజాస్వామిక పక్షులైన మీ కాంగ్రెస్, లోక్ సోషలిష్టు పార్టీలవారే ఇట్లు కీచులాడుకొనుచుంటిరే మోయీ? రానున్న యుద్ధమునకిది ముందు రిహార్సలా యేమి?

లచ్చన్న: శ్రీశ్రీతిమ్మారెడ్డి ప్రభుత్వములో పాదముపెట్టిన నాడే యిది ప్రారంభమైనది.

రాజు : శ్రీ ప్రకాశం, విశ్వనాథాదులు పదవులు స్వీకరించిన నాడే ఇందుకు పాదులు పెట్టబడినవి.

తిమ్మా: ప్రజలచేతిలో కాంగ్రెస్ పరాజితమై, ప్రజాస్వామ్యమే నశించి, నియంతృత్వశక్తులు విజృంభించు ఆపత్సమయములో వెనుక ముందాడక ప్రభుత్వమునకు కొమ్ముగాచి ప్రజాస్వామ్యమును పరిరక్షించిన వాడను నేను. మీవలె_

లచ్చన్న: అవును, మేమును నీవలె ప్రజలముందు ఓట్లు ముష్టెత్తుకొనునపుడు, 'కాంగ్రెస్ వ్యతిరేకులము. కాం

గ్రెస్‌ను ఓడించుము, అని గొంతెత్తి అరచి ఆతదుపరి
ఏరుదాటి తెప్పగాల్చుట మాచేతనైనది గాదు.

విశ్వ : ఏమి ప్రజాభిమానము? ఎక్కడి సత్యవాక్ పరిపాలన?
మద్రాసులో కాంగ్రెస్ ప్రభుత్వమేర్పడుటకు మీరు
కాదా కారణము? ఆతరువాత ఆకాంగ్రెస్ ప్రభుత్వ
మెక్కడ పడిపోవునోయని అనురూపసహకారముపేరిట
చీటికీమాటికీ ప్రభుత్వమును బలపరచుచూ వచ్చినది
మీరుకాదా? ఆంధ్రప్రభుత్వములో మంత్రిగానున్న
పుడు ఈ కాంగ్రెస్ వ్యతిరేకత ఏమైనది?

లచ్చన్న: అందుకనియే చెప్పుచున్నాను. మొదటినుండియు
మావైఖరియే, మావిధానములే మీ విజయములకు,
మీరింతగా అగుటకూ కారణములు. ఆవిశ్వాసము
నైనాయుంచి మద్యనిషేధమును రద్దొనరించి లక్ష
లాదికార్మికులకు జీవనభృతి కల్పించగోరుచున్నాను.

నాగిరెడ్డి: మేము మిమ్ము కోరునవి ఏమంత కష్టసాధ్యములు
కావు. కొంపమునుగునవియూ గావు.

సంజీవ : ఏమైనను మాఅభిప్రాయములకు విరుద్ధములుకావంత
వరకే—

నాగిరెడ్డి: మిమ్మును, మమ్మును ప్రజలు తమ ప్రతినిధులుగా
ఎన్నుకొని పంపినారు. అట్టి ప్రజాప్రతినిధులతోకూడిన
దీశాసనసభ. ఈశాసనసభ చేయు నిర్ణయములను
అమలుపరచవలసిన బాధ్యతేగదా మంత్రులు?

తిమ్మా : మంత్రులనగా మీరు ఒప్పగించిన పనినెల్లా చేయు
బానిసలనియా?

నాగి : ఎవరు ఎవరికినీ బానిసలు గారు. మన మందరమును ప్రజలకు బాధ్యత వహించవలసిన వారము. మద్య నిషేధ విషయమున రామమూర్తి కమిటీ సిఫార్సుల నమలుపరచ వలసినదనియూ, బంజరులను ఉచితముగా పేదలకు పంచవలసినదనియూ శాసనసభ చేసిన శాసనములేగదా ? ఇక ఈనాం రైతుల విషయమా ? మీ కాంగ్రెసు పార్టీయే తీర్మానించినది. ఇక నేమి బాధ ?

సంజీ : నాగిరెడ్డీ ! శాసనసభ చేయునిర్ణయమును సలహాగా మాత్రమే పాటింతుము. అవసరమని మంత్రివర్గము నకు తోచినచో అమలు పరతుము. లేదా లేదు.

నాగి : ఒకవేళ మీప్రభుత్వమునే దిగిపొమ్మని అవిశ్వాస తీర్మానమే చేసినచో ?

తిమ్మా : అక్షరాల అదియునూఅంతే. ఇష్టమైననే దిగుదుము.

నాగి : ఇది ప్రజాస్వామికమా ?

సంజీవ : నీకుతోచిన ప్రజాస్వామ్యము నీయది. మాకుతోచి నది మాయది. నీవు చెప్పినదానినే అమలుపరచవలె నని నిర్బంధమా ?

తిమ్మా : అవునవును. నిర్బంధమా ? నియంతృత్వము. కమ్యూనిస్టు నియంతృత్వము.

నాగి : కల్లుగీత కార్మికులును, బంజరు సాగుదారులును, ఈనాం రైతులును సత్యాగ్రహమునకు దిగి జైళ్లకు నయితము పోవునంత పట్టుదలగా నున్నారు. ప్రజా

కోధము, ననవసరముగాపైకి దెచ్చుకొనకుడు. ప్రజలతో పోరాటము పతనహేతువు.

తిమ్మా : పోరాటము పోరాటమని బెదరింపజూచుచున్నావు.

కదనము సేయనుంటి మని
గా ప్రతిపక్ష సవాలు, దీనికిన్
బెదరి ప్రధానమంత్రి తన
బీరము నీరముపాలు చేసినన్
బెదరగ తిమ్మరాడ్వరుడు
భీరువుగాడు; చతుస్సముద్రముల్
చదరముజేసి యీపుడమి
చాపగజుట్టక నూరకుండగాన్

లచ్చన్న: ఓయీ! సంజీవరెడ్డి దయా సంపాదిత ఆంధ్రప్రభుత్వ ధౌరేయా ! తిమ్మరాయా !! ఇంకెన్నినాళ్ళు నీవీ బీరములు పల్కెదవు ?

ప్రకాశం: మనమందరమూ కార్యార్థియై వచ్చిన ప్రతిపక్ష నాయకుని ఆవలకు బంపు నుపాయ మాలోచింప వలయునేగాని యీఅకారణ పరస్పర కలహమెందుకు? పెద్ద వాడననియేనా నామాట లాలింపుడు ఏడీ సంజీవ రెడ్డి యెక్కడ ?

సంజీవ: (తనలో) ఈతడేదియో బెదిరిపోయిన ఉపదేశములు చేయును కాబోలు ! (ప్రకాశముగా) ఇదిగో వచ్చుచున్నాను. (ప్రకాశముగారివద్దకుబోయి కూర్చొనును)

ప్రకాశం: నాయనా సంజీవరెడ్డీ! వృథా పట్టుదలలతో మన మంత్రివర్గాన్నెందుకు మట్టిపాలు చేస్తావు? చూడ చూడగా మన కాంగ్రెసు పార్టీగూడా వాళ్ళడిగే విషయాల కనుకూలంగానే వున్నట్లుంది. మరీ బంజరు తీర్మానము మనముగూడా ఏకగ్రీవంగా చేతులెత్తిందే గదా! జనావిదేముంది? కుడుమిస్తే పండుగ. అట్టి వాళ్ళతో అకారణ వైరమెందుకు? వాళ్ళుమాత్రమే మడిగారు గనుకా__

అనిన మాటకు నిలబడు డంతెయనిరి
మావి మాకివ్వ నదే బహుమానమనిరి
అట్టివారితో వ్యర్థ కయ్య మ్మదేల?
బ్రతికి నన్నాళ్ళు సుఖములబడయబోక.

విశ్వనాథం: సంజీవరెడ్డీ! మనకు పెద్ద. ప్రకాశంగారిమాటలు మనకు వినదగినవి. ప్రభుత్వ బంజర్లను సాగు దార్లకే యిచ్చిన మనకు పోయెడిదేమున్నది? కన్నుదగులు పుల్లను కనిపెట్టి తిరుగుమనిఆర్యోక్తి. అదియును గాక ప్రతి పక్ష పార్టీలతో బాటు మనపార్టీలోని కొందరు గూడ పొందునకే కృతనిశ్చయమైయున్నారు. ఈచిన్న కారణముగా ప్రభుత్వమునకే ఎసరు పెచ్చుకొనుట అంత యుక్తియుక్తము గాదు.

సంజీవ: మీరు పెద్దలు. చెప్పవలసినవారు గావునచెప్పిరి. కాని

"న్యాయముగ పంచు బంజరు
న్యాయము దప్పినను, పోరుఖాయం" బనియా
మాయావులు కబురంప, 'స
రే' యనినన్ వారి కోడుటేయగు గాదే?

అయినను మీమాటలు నిరాకరింపక శాసనసభా తీర్మానములను అమలుజరిపితిమే యనుకొనుడు. ఎప్పుడేని వారు మనలను దించుటకై మరల మరల ప్రయత్నించ కుందురా ?

(నవ్వి) వారేదో బలవంతులై కాంగ్రెసు నోడించగల రని కలనైనా దలంపకుడు.

మమ్ములదింపరాదో, బలమున్నది యున్నచో ? చేసినట్టి, చ ట్టమ్ములె బుల్లదాఖలగుటల్ గని చూచుచు నూరకుండరె, దే భ్యమ్ములమాడ్కి, సంధియని ప్రార్థన సేతురె ? యిట్టివీరు, క య్యమ్మునజంకి, నెయ్యమున కియ్యకొనన్, నవరయ్యమమ్ములన్.

వారల పిల్లి శాపముల వాడికి జంకిన, మీదుబోధ, వి న్నారము గామటంచు మదినాగ్రహమూనకు డెల్లరున్, నమ స్తే! వృషముఖ్యమంత్రినయి స్వీయప్రభాయుతమూర్తినైన, నా పేరు జగంబునన్ వెలుగ వేడెద, నట్టు లనుగ్రహింపరే !

బ్రిటిష్ సామ్రాజ్యవాదుల ఫిరంగులముందే నిలబడి రొమ్మిచ్చిన కాంగ్రెస్ ప్రతినిధులమై—నేడీ బిక్కాఫకీరులగు ప్రజలసత్యాగ్రహముల ముందు తలవంచి వారన్నదానికెల్లా 'ఔ'నని తలలూపి తలవంపులు తేజాలను. నన్ను మన్నింపుడు.

ప్రకా : (జనాంతికముగా) నాయనా విశ్వనాథం !

మంత్రిగానె బ్రతికి, మరణించు యోగ్యత
నున్నయంచు నొసట నున్నదేమొ !
చావబోవు ముందు, లావైన దుఃఖంబు
వచ్చిపడెను కాచుచిచ్చు పోల్కి.

(కుర్చీలో వ్రాలబడును)

విశ్వ : (ఉత్తరీయముతో విసరుచూ) ఉపముఖ్యమంత్రీ సంజీవ రెడ్డీ! ఏమిచెప్పిననూ మీ బాగుకొరకేగదా! అట్టి యెడ కొంచమాలోచించి యీ సభాసదులకు కూడా నీవాదన నొప్పించి యీ ముప్పును తప్పింపుము.

సంజీవ: సభాసదులారా! లోక్, సోషలిస్టు, ప్రజాపార్టీ సభ్యులారా! స్వతంత్రులారా! ఎట్లయిననూ కాంగ్రెసు ప్రభుత్వమునుదించి, తమ నియంతృత్వాధికారమును స్థాపింపజూచుచున్న కమ్యూనిస్టు ప్రేరణము చేతనే యీ సత్యాగ్రహాది పోరాటములు విజృంభించు చున్నవి. యిది జగమెరిగిన సత్యమే. మీరు స్వతంత్రులు. ఒకసారి ప్రజలెన్నుకొన్న పిదప ఐదుసంవత్సరములవరకునూ మిమ్ము అదేమనుట కెవ్వరికినీ హక్కు లేదు. ఆలోచించుడు. మనలో మనమెట్లున్ననూ కమ్యూనిస్టుల నోడించుటకై ప్రజాస్వామ్యవాదుల మైక్యము కాకున్న అతిప్రమాదము సంభవింపగలదు. గాన ప్రజాభిప్రాయమని జంకకుడు యిక-

కృషిక్ లోక్ పార్టీ నాయకా, శ్రీలచ్చన్న సర్దార్! ప్రజా పలుకుబడి పేరుతోవల కమ్యూనిష్టులతో పోటీకి దిగి అశాంతిని రేపెదవు. మొదటినుండియూ మీరొనర్చుచూ వచ్చిన యుపకారమునకు కృతజ్ఞులము.

తిమ్మారెడ్డి: పాపము శాంతించుగాక! మిత్రమా! చాలుచాలు.

మనకున్ దోడ్పడుమంచు భీరునొకనిన్ ప్రార్థింపగా వచ్చునే కనకత్మాధర ధీర ! యెట్టి ఘనసంగ్రామంబె యాగాక, నీ

యనుగుంతిమ్మయ చచ్చెనే యిటులదైన్యంబందగా? నేను జ
చ్చిన వెన్కన్ యెటుజేసికొన్న, నిపుడే తేబోకు తల్వంపులన్

లచ్చన్న: యేమీ! సోదర ప్రజాస్వామిక పక్షులను తమవైపు
నకు రమ్మని కోరుటనుగూడా సహించనంతటి అధికార
గర్వాంధతయా ?

నాగిరెడ్డి: లచ్చన్నా ! కోపగింపకుము. ప్రభుత్వ రథచక్రము
నంతన్నూ తన ఒక్కని చేతిమీదుగనే త్రిప్పవలెనను
తిమ్మారెడ్డిగారి చేతుల మీదుగనే ఆకాస్త యూజరుగ
నిమ్ము.

రాజు: ఇంతటి అధికార గర్వమున నున్నవారిని బరిత్యజించుట
యే యుక్తము.

తిమ్మారెడ్డి: ఇట్టివారు పరిత్యజించిన నేమి ? పరిగ్రహించిన
నేమి ? అన్నా! సంజీవరెడ్డీ !

చాలున్ జాలును, పేరుజూడగ ప్రజాస్వామ్యైకపక్షంబు, లిం
దే లాభంబులు గానరామి నిక 'యింకీ - పెద్ద పేరేల?' నం
చాలోచించి ప్రజాభిమాన బురఖా పైగప్పు కోనుండ్రి; యిం
కేలా? యీఘనులింత తోడుపడువారే యంచు నాశించెదో!

లచ్చన్న: ఓయీ దురహంకారపూరితా !
మీరంబోకుము పొల్లుమాట, లెపుడేన్ మీరంతరండంచు మ
మ్మారాధింతురొ లేదొ చూతము, సరేనా!

(సభవైపు తిరిగి) లెండు! లేవయ్యా రా
జూ! రా పోదము, ఎంత లెంతటిమహాశూరాత్ములోయేమొ వీ
రీరు న్గెల్తురొ వీరు? వీరలబలాధిక్యంబదేమో! గనన్ (లేతురు)

నాగిరెడ్డి: (వారించి) కృషిక్‌లోక్‌పార్టీ నాయకా! మాజీమంత్రి సత్తమా! శ్రీలచ్చనా! కించిత్కాలమోపిక పట్టుము. అందరమూ పోవచ్చును. ఉపముఖ్యమంత్రీ! పదుగురుండ గనే చివరిసారి నేచెప్పబోవుపల్కుల నాలించి మరియూ యాలోచించుము

తగవులు సహోదరులలో
తగవని; యెదో సర్దుబాటు తగునని; మిమ్మిం
తగ ప్రజలు గోర, నీగతి
తెగియించుట తగునె? ధర్మమగునే? జగతిన్

నమ్ముమునావచించు వచనమ్ముల, న్యాయముగెల్చు, నిల్చు స త్యమ్ము, నశించు స్వార్థము; సదాయుగధర్మమిదేగదోయి, క న్గొమ్మిక నంత్యకాలమున కొండలమించెడి యండలున్న, పిం డమ్మిడు దిక్కు-దోచదకటా! ప్రజలాగ్రహమూని నిల్చుచో
యిక మీవిషయమా?

మిమ్ముల మీరె జూచుకొని మీదు నెరుంగక, కోటిరెడ్డి మీ సమ్ములు, తిమరాడ్వరుభుజమ్ములు, తొల్లి టహమ్ములన్ మదిన్ నమ్మి; నభమ్ము నందు భవనమ్ములు గట్టిన, కృంగి శృంగ భం గమ్మగుటే నిజమ్ము; అధికారము తేదుజయమ్ము; నమ్ముమా!

సంజీవ: (తనలో) నోటికివచ్చినట్లెల్ల ప్రేలుచున్నాడు. ముందు వీని తిక్క- యడచినంగాని (ప్రకాశముగా) ఓయీనాగిరెడ్డీ ప్రతిపక్షనాయకుడవు గదా! యని యిచ్చిన సమ యమునంతయూ నోటికి వచ్చినట్లెల్ల పేలుటలోనే వినియోగించుకొనుచున్నావు. ప్రజలల్గిన నదియగు నిదియగు నని యీ పిల్లిశాపనార్థము లేల? దమ్ము లున్నచో వమ్ముల నీడ్చివైచి ప్రభుత్వాధినేతవు

గమ్ము. లేదా! తిరిగి 1949 నాటివలె యరణ్యముల
పాలయ్యేదరు సుమా !

నాగి : సభాసదులారా ! వినుచుంటిరా ? నాయోపినంత
వడి చెప్పిచూచితిని కాని—

కాలము కర్మమున్ గలసి గ్రాలక, మోరకు లూరకే నిదా
నాలతొ పొందు సేతుర? జనాళిక్రమించి గమించి మించు, న
శ్కాలము దాపురించె; ప్రజ గానని యంధ ప్రభుత్వజాతి పో
గాలము దాపురించె; కలకాలము నిల్చునె? మాయసంపదల్

ఇదే నేను అవిశ్వాసతీర్మానమును ప్రతిపాదించు
చున్నాడను. మీరెల్లరూ ఏపార్టీకి చెందిననూ న్యాయపక్ష
పాతులరై యోచించ ప్రార్థన.

తెలుగుదేశంపు నదీజలాల్ గొని పోవ
కృష్ణ-పెన్నార్ కుట్రబన్ను నాడు
తెనుగుదేశప్రజా ధనముతోడ పరాయి
ప్రాంతాల నభివృద్ధి పరచు నాడు
'ప్రత్యేక రాష్ట్రమ్ము పనికిరాద'ని కేంద్ర
యధినాథులకు సిఫార్సంపునాడు
తెలుగు దేశమ్మంత మిలటరీ క్యాంపు గా
వించి తమ్ములకు గాల్పించునాడు

నాటి మద్రాస్ ప్రభుత్వమ్ము నాటినుండి
కాదొ ? వీరలె మంత్రులు— కాని కలదె
తెనుగుదేశ జనాళికి తేని కీడు ?
చేసినట్టి యొకానొక చిన్నిమేలు ?
అయిననూ

చెల్లియొ, చెల్లకో, తమకు చేసిన యెగ్గులు సైచిరంత; ఆ తొల్లి గతించె లెమ్మని, యెదో విధి శాంతి లభించనిమ్మనీ, పిల్లలు పాపలున్ ప్రజలు పెంపువహింపగ పొందు గోరినా, రెల్లిరణమ్మొ? పొందొ? యికనేదియొ తేల్చుట మీదువంతగున్

యీనాటికిప్రజా ప్రతినిధుల మైన మనలను, తద్వారా ప్రజలను, శాసన సభనూ త్రోసిరాజనిన యీ ప్రభుత్వ మెవ్వారి కొరకు ? మీరెల్లరును యించుకంత ఓపికతో నాలోచించి పార్టీవిభేదముల ప్రసక్తియే లేక యీయవిశ్వాస తీర్మానమును నెగ్గించి ప్రజాస్వామ్యమును రక్షింప గోరుచున్నాడ

సంజీవ! ఓ హూ హూ! నీప్రతిపాదనకు ఓటుచేసి నిన్ను గెలిపించుట లచ్చన్నకూ రాజునకూ అవమానము గాదా ! కమ్యూనిస్టుపార్టీయే ప్రభుత్వమును దించినదన్న ఖ్యాతి మీకుదక్కించునంతటి యవివేకులా ?

(శ్రీలచ్చన్న, రాజుగార్లు ఒకరినొకరు చూచుకొందురు)

నాగిరెడ్డి: మాకు ఖ్యాతిప్రధానము గాదు. పట్టుదల లంతకన్నను కాదు. ప్రజాభీష్టము నెరవేరుట యొక్కటేమాకు ప్రాముఖ్యము. లచ్చన్నాదుల కంత కష్టమగునేని వారి ప్రతి పాదనకు మేమే ఓటు చేసి నెగ్గించెదము.

లచ్చ: అయిన నేనే అవిశ్వాసతీర్మానమును ప్రతిపాదించెదను.

సంజీ : నాగిరెడ్డీ! ఎంతగతి పట్టెనోయీ!? పదుగురకంటె లేని లోక్‌పార్టీకి అరవైమంది కమ్యూనిస్టులచే ఓటు చేయించి ఒకవేళ ప్రభుత్వమే పడిపోవుచో ఆఖ్యాతిని

లోకశాస్త్రికి దక్కనిచ్చిన మీాకేమి లాభము ? హుం !
ఎంత మగసిరిలేనితనము !

తిమ్మా : అవునవును. ఎంత మగసిరిలేనితనము.

నాగి : మాకు ఫలితమే ప్రధానము. ప్రజావ్యతిరేక ప్రభుత్వ
మును ఉంచుటయా ? దించుటయా ? అన్నదే
ముఖ్యముగాని యెవరిచే నైననేమి ?

లచ్చ : (చదువును) 'మద్యపాన నిషేధ విషయమున రాము
మూర్తి కమిటీ సిఫారసులను అమలు జరుపవలెనను
శాసనసభా తీర్మానమును ఖాతరుచేయని యీ మంత్రి
వర్గము అధికారమున నుండతగదు"- యిదీ నా ప్రతి
పాదన.

సంజీ : లచ్చన్నా ! త్వరపడుచున్నావు. తీవ్రపడి కమ్యూనిస్టు
లను నెత్తికెక్కించుకొనెదవా ? వారు విజాతీయులు
మనమో అచ్చభారతీయులము. మనమాటలెట్లున్ననూ
పనులలో ఒకరికొకరము తీసిపోము గదా ! మరొక్క
సారి ఆలోచించుకొనుము. రాజూ ! నీవు మరింత
తీవ్రముగా నాలోచించదగిన సమయమయ్యా! మీారు
కాంగ్రెసు కమ్యూనిస్టులిరువురకునూ సమానదూర
మున నుండవలసిన వారుగదా! యికనేమి? తటస్థ
ముగానైనా యుండుడు.

నాగి : పబ్బము గడుపుకొను ప్రవచనంబుల నింక కట్టి
పెట్టుడు. గౌరవాధ్యక్షా! ఓటుతీసికొన గోరుచున్నాను
శాసన సభ్యులారా ! యిక్కడి మన చర్యలను
ముక్కోటి యాంధ్రులూ, యావద్భారతమూ తిలకించు

చున్నది. ప్రజావ్యతిరేక వర్తనను ప్రజలు క్షమించరు. న్యాయమార్గమును వదలకుడు.

సంజీవ: హానరబుల్ స్పీకర్! ఓటు తీసికొనవచ్చును. నాగిరెడ్డీ! 'శృంగభంగమ్మగుటే నిజమ్మగు; నహంకృతి లేదు జయమ్ము నమ్ముమా' శాసనసభ్యులారా! మా ప్రభుత్వమోడినచో నసెంబ్లీయే రద్దగును సుమా! అప్పుడు తిరిగి మీరే యెన్నికలలో రాగలరనినమ్మకమేమి? ఏల వృథగా బేటాలు, జీతము పోగొట్టుకొనెదరు? కొంచెము కాలము కండ్లు మూసుకొన్న మరి రెండేడ్లు.

స్పీకరు: (లెక్కబెట్టినట్లు నటించుచూ) ఓటు తీసికొనుచున్నాను. అనుకూలము? 69 ప్రతికూలము? 68 తటస్థము ?1 (కొంచెమాగి) అవిశ్వాస తీర్మానము నెగ్గినది ప్రభుత్వమోడిపోయినది.

(తెరలో, ప్రజలకోలాహలము ప్రభుత్వపక్షముదిగ్భ్రమ చెందును. శ్రీలచ్చన్న, రాజుగార్లు దిగ్భ్రమతో ఒకరి నొకరు చూచుకొందురు.)

సంజీవ: (తెప్పరిల్లి) యిదేమేము ప్రభుత్వమునుండి దిగిపోవుచున్నాము! అసెంబ్లీయునూ రద్దగును. లచ్చన్నా! రాజూ! యిక మీ యిచ్చవచ్చినట్లూరేగుడు (వెళ్ళిపోవును)

ప్రకాశం: అంతతొందరేమిటయ్యా! దీనినికూడా మనము సలహాగా తీసికొనుటకు అవకాశమున్నది.

తిమ్మారెడ్డి: అవును మనమేల దిగవలయును? (దిగిపోవును)

విశ్వనాథం: ప్రజాస్వామికములోని పార్లమెంటరీ సాంప్రదాయము ప్రకారము దీనిని తేల్చవలసినది శ్రీగవర్నరు అచటికేపోవుదము. శ్రీప్రకాశంగారితో పాటు నిష్క్రమించును.

స్పీకరు: కాలనిర్ణయము లేక అసెంబ్లీ ముగిసినది.
(నిష్క్రమించును)

నాగిరెడ్డి: సభాసదులారా! వివిధ పార్టీనాయకులారా ప్రజావ్యతిరేక ప్రభుత్వమంతరించినది. యికమనము ఐక్య ప్రజాతంత్ర ప్రభుతము నేర్పరచి ప్రజాకార్యక్రమము నమలుపరచవలసియున్నది. యిందుకేమందురు ?

రాజు: (తనలో) పెద్దప్రమాదమే వచ్చిపడినది (ప్రకాశముగా) నేనాలోచించుకొనవలయును (పోవును)

లచ్చు : దీర్ఘముగా ఆలోచించవలసిన విషయము (పోవును)

తెరలోనుండి : శ్రీగవర్నరుగారు అస్సెంబ్లీనే రద్దుచేసినారు.

నాగి : అదియేమి ధర్మము ? ప్రతిపక్షమునకు మంత్రివర్గము చేయు నవకాశమిచ్చి, అట్లు మంత్రివర్గము నేర్పరచలేనప్పుడుగదా ! అస్సెంబ్లీని రద్దుచేయుట?

తెరలో : ప్రతిపక్షములోనివారగు శ్రీలచ్చన్నయ్యా, శ్రీరాజు గారునూ నూతన మంత్రివర్గము నేర్పాటుచేయుట కిష్టపడలేదట.

నాగి : ప్రతిపక్ష నాయకుడను నేను- మంత్రివర్గమును ఏర్ప రచజాలమని నేనుచెప్పిన తరువాతగదా! నేను మంత్రి వర్గమును ఏర్పాటు చేయుటకు సిద్ధముగానున్నాను. అవకాశ మిమ్మనుడు.

తెరలో: గవర్నరుగారి కిష్టమున్ననే మంత్రివర్గము నేర్పరచుట. అట్టివిశ్వాసము వారికిలేదు. కనుకఅస్సెంబ్లీ రద్దయినది.

నాగి : అహో ! ఏమి ప్రజాస్వామికము ? కాంగ్రెస్‌వారు మంత్రులు కాగలిగిననే ప్రభుత్వమునూ శాసనసభయూ నన్నమాట. యితరుల చేతి కధికారము వచ్చునవకాశ మేవచ్చుచో శాసనసభయేసున్న. యికనీప్రజాస్వామ్య ములో ప్రజలకున్నదేమి ? (కొంచెమాగి)

రైతుకూలీ సోదరులారా! వివిధ వర్గప్రజలారా!

పోయితి వారితో నెటులో
పొందొన గూర్చెదమంచు, వ్యర్థమై
పోయెను మ్యాకశమల్; ముదిరి
పోయెను వారికి బంధు ప్రీతి; యే

మో! యొక వాడి సూదిమొన
మోపిన నేలయు చేతిమీాదుగా
నీయరటే! ప్రభుత్వప్రభు
లెక్కడి రక్కసి స్వార్థ కాంక్షయో!
అందుచేతనిక నిట్లగు
ఐనవి సంధి సంబరము,
లంతిమ ఆయుధముండె నొండె,దా
పై నది "దున్ను వారిదె హా
లమ్మ"ను ధర్మరణమ్ము; పరిక
ర్మాను ఫలమ్ము వారిదె; ప
రాజయమన్నదె లేదు, మధ్య నె
లైన జనాళి కంత్య విజ
యమ్మను శాశ్వత శాంతి నిత్యమా
(నిష్క్రమించును)

ద్వితీయాంకమూ రాజకీయ కురుక్షేత్రం
సర్వమునూ సంపూర్ణము.

ఠాగూర్ ప్రింటర్స్, తెనాలి.